# షికాగో నగరోపన్యాసములు

## (వివేకానంద సందేశామృతము)

శ్రీ వివేకానందస్వామి షికాగో విశ్వమత
మహాసభయందు ఒసగిన
ఉపన్యాస రత్నములు

అనువాదకుడు :

చిరంతనానందస్వామి



శ్రీ రామకృష్ణ మఠము
మైలాపూరు : : మద్రాసు-600004.

# తొలి నుడి

వివేకానందనామమును దిగ్దిగంతములు మాఱు మ్రోగించిన దివ్యోపన్యాసములే ఈవివేకానంద సందేశామృతరూపము నొందినవి. 1893-వ సంవత్సరమున అమెరికాయందలి షికాగోమహానగరమున జరిగిన విశ్వమత మహాసభయందు శ్రీ వివేకానందస్వామి సనాతనధర్మ (హిందూమత) ప్రతినిధియై యీ యుపన్యాసముల నొసగియున్నాడు. 'అన్యమతములు శాశ్వతనరకహేతువులు ; మా మార్గ మొక్కటియే మోక్షద్వార' మనియెడు స్వతాహంకారపూరితుల దురభిమానతిమిరమునకు సూర్యోదయమై పరిణమించిన వీ యుపన్యాసరత్నములే! జిజ్ఞాసయందేమి, తత్త్వజ్ఞానమునందేమి, క్రైస్తవమతమును మించిన మతములు కలవని పాశ్చాత్యలోకమునకు జాటిన

ఏ యుపన్యాసరత్నములే! వేయేల? సనాతన ధర్మోన్నతిని పశ్చిమఖండమున కే కాక, ప్రపంచ మంతటికిని జాటుటకు దోడ్పడిన యీ మహోపన్యాసములు మన కత్యంతము మననీయములు.

సనాతనధర్మోన్నతినిగూర్చియు స్వామి సందేశమహాత్మ్యమునుగూర్చియు విశ్వమత మహాసభయందలి శాస్త్రశాఖాధ్యక్షు డిట్లు చాటెను:

"హిందూమతమువలె విశ్వమతమహాసభను అమెరికా ప్రజలు అత్యాశ్చర్యకరీతిని ఆకట్టిన మతసంస్థయు తత్ప్రతినిధియగు వివేకానందస్వామివంటి మహావక్తయు లేరనుట నిస్సంశయము. స్వామి యుపన్యాస మున్నచో, సభ్యులకు అపరిమితోత్సాహము, ఆనందము..."

జగత్ప్రసిద్ధిగాంచిన బిసెంటు వనితామణి యీ సందర్భమున వ్రాసిన వాక్యము లిట్లే సముచితములై యొప్పుచున్నవి:

"...ఆ సమయమున అతనిమూర్తి సూర్యప్రభాభాసమానమై విలసిల్లెను...అతని సందేశవాక్యామృతము

శ్రోతృ సభ్యు లానందపరవశులై యాతఁ డుచ్చరించు ప్రతిశబ్దమును స్వరమును నిశ్శబ్దులై యాలకించువారు. స్వామిసందేశమును విని యాతని యుపన్యాసానంతరము సభనుండి యీవలకు వచ్చుచు నొక క్రైస్తవు డిట్లు పల్కెను: "ఆ మహనీయుఁడా, క్రైస్తవమత బాహ్యుడు (Pagan)! ఆ మహనీయుని దేశీయుల యుద్ధరా, మన క్రైస్తవమత బోధకులను పంపుట! వారే మనయొద్దకు మతబోధకులను పంపు టుచితము." (క్రైస్తవు.)

బోస్టన్ ఈవినింగ్ ట్రాన్స్‌పోర్ట్ ఇట్లు ప్రకటించెను:

"భావౌన్నత్యముచే నేమి, దివ్యమూర్తిమత్త్వముచే నేమి, వారిమహాసభను అత్యంత ప్రీతిపాత్రుడై యుప్పిన వారిదే, సభావేదికపై వారి దగ్గిడినజాలను, సభ్యుల హర్షధ్వనులు మిన్ను ముట్టును... సభాకార్యక్రమము ముగియుటకుఁ సభ్యుల నిలిపెట్టుటకై కార్యనిర్వాహకులు వివేకానందు నాపువారు..."

"అతడు ఈశ్వరప్రేరితమహావక్త" యని న్యూయార్క్ క్రిటిక్ పత్రిక ప్రకటించెను.

ఇట్టి ప్రశంసల నన్నిటిని ప్రకటించినచో, ప్రత్యేక మొక గ్రంథ మగును.

పాఠకులకు స్వామిభావములు సుబోధమగు టకై ఆవశ్యకమగు తావులందెల్ల ప్రమాణ వచనములను పాదదీపికలందు (Foot Notes) క్రోడీకరించి యున్నాము, మఱియు టిప్పణులను వ్రాసియున్నాము.

శ్రీ ఆకుండి పరబ్రహ్మశాస్త్రి [చెన్నపురి లోని లొయొలాకళాశాల (Loyola College) లో అధ్యాపకులు]. శ్రీ వ్యాసశర్మలచే తెని గింపబడిన తొలికూర్పు ఇంచుక మా కిందు తోడ్పడి యున్నది.

శ్రీరామకృష్ణమఠము<br>మైలాపూరు, మద్రాసు-4<br>ఫిబ్రవరి, 1944

చిరంతనానందస్వామి

# విషయసూచిక

ఓమ్

నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# షికాగో నగరోపన్యాసములు

(షికాగో విశ్వమత మహాసభయందలి
శ్రీ వివేకానందస్వామి ఉపన్యాసములు)

## విశ్వమతమహాసభవా రొసగిన స్వాగత మునకు స్వామి సమాధానము

(1893 వ సం. సెప్టెంబరు, 11.వ తేది)

అమెరికా సోదర సోదరీమణులారా !

మాకు మీ రొసగిన మనఃపూర్వకమైన స్వాగతమును పురస్కరించుకొని యీ సమయమున మీతో ముచ్చటించుట నాకు బ్రహ్మానందదాయకము. ప్రపంచమందలి అత్యంత

ప్రాచీన యతిసంప్రదాయము పేర మీకు నాయభివందనములు ; సమస్త మతములకును సమస్త ధర్మములకును దల్లి యనదగు సనాతన ధర్మముపేర మీకు నా యభివందనములు ; నానాజాతులతో, నానాసంప్రదాయములతో, గూడిన భారతజనసహస్రముల పేర మీకు నా యభివందనములు.

సహనభావమును వివిధ దేశీయులకు దెలిపిన ఘనతయు గౌరవమును నతిదూర దేశీయు లగు ప్రాచ్యులకు జెల్లునను టెంతయు సమంజసమని తత్ప్రతినిధులనుగూర్చి యీ సభా వేదికనుండి మీకుదెలిపిన వక్తలకును నాయభివందనములు. సహనమును సర్వమతసత్యత్వమును లోక మునకు బోధించిన సనాతనధర్మము నా ధర్మ మని గర్వించుచున్నాను. సర్వమతసహనము నే గాక, సర్వమతములును సత్యము లని మేము

నమ్మెదము. సమస్తమత సమస్తదేశముల
నుండియు పరిపీడితులై, శరణాగతులై వచ్చిన
వారలకు శరణ్యమైన దేశము నా దేశమని
గర్వించుచున్నాను. రోమకక్రౌర్యమునకు
గుఱియై తమ దేవాలయము తుత్తునియలైన
యేటనే దక్షిణభారతదేశమునకు వచ్చి, శరణు
పొందిన యూదులను—నిజమైన యూదు లన
దగువారిలో శేషించినవారిని — మా కౌగిట
జేర్చుకొంటి మని తెలుప గర్వించుచున్నాను.
మహాజొరాస్ట్రీయసంఘమున శేషించిన వార
లకు శరణొసగి, నేటికిని వారల నాదరించు
చున్న(సనాతన)ధర్మము నా ధర్మమని గర్వించు
చున్నాను. సోదరులారా, అతిబాల్యము
నుండియు పారాయణమొనర్చుచుంటినని నాకు
జ్ఞప్తిలో నున్న యొక స్తోత్రమునుండి—ప్రతి
దినము కోట్లకొలది మానవులచే పారాయణ

మొనర్పబడు నొక స్తోత్రమునుండి — కొన్ని చరణములను క్రోడీకరింతును:* "వివిధప్రదేశ ములలో బుట్టిన నదులు సముద్రమున సంగ మించునట్లే వివిధారాధన మార్గములు వక్రములై గనవ్పట్టినను, అవక్రములై గనవ్పట్టినను, సర్వే శ్వరా! నిన్నే ప్రాపింపజేయుచున్నవి."

"ఎవరు ఏరూపమున నన్ను గ్రహింతురో, నేను వారి నట్లే యనుగ్రహించుచున్నాను.

---

* స్వామి యర్థమును మాత్రము తెలిపియున్నాడు: మూల మిది:

"...................................

రుచీనాం వైచిత్ర్యాదృజుకుటిల నానాపథజుషామ్
నృణామేకో గమ్యస్త్వమసి పయసామర్ణవ ఇవ."

—శివమహిమ్నస్తోత్రము, 7.

ఎల్లవారును సమస్తమార్గములచేతను తుదకు నన్నే ప్రాపించుచున్నారు."*

అని గీతలలో తెలుపబడిన యద్భుతసిద్ధాంతమును ప్రపంచమున నింతవఱకు జరిగిన మహోత్కృష్టసమావేశములలో నొకటగు ఈ మత మహాసభయే సమర్థించుచు, ముక్తకంఠమున లోకమునకు చాటుచున్నదని చెప్పనొప్పును. శాఖాభిమానము, స్వమతదురభిమానము తజ్జన్యమగు మూర్ఖాభినివేశమును సుందరమైన యీ వసుంధరను చిరకాలమునుండియు నాక్రమించియున్నవి. భూమిని అయ్యవి దౌర్జన్యమయమొనర్చి, యనేకపర్యాయములు మానవరక్తసిక్తము గావించినవి; నాగరికతను నాశన

* "యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్, మమవర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః." —భగవద్గీత, 4. 11

మొనర్చి, సంఘములను నిరాశపాలుచేసినవి. ఈ ఘోరరాక్షసులు చెలరేగియుండనిచో, మానవసమాజము నేటికంటె విశేషాభివృద్ధి నందియుండెడిది. కాని వాని యవసాన సమయ మాసన్నమైనది; ఈ మహాసభాగార వార్ధము నేటియుదయము మ్రోగింపబడిన గంట సర్వవిధములైన స్వమతదురభిమానమునకును పరమతద్వేషమునకును — కత్తిచే గానిండు, కలముచే గానిండు, సాగింపబడు—సర్వవిధము లైన హింసకును మాత్రమేకాక, ఒకేగమ్యము ను బ్రాపింపబోవు జనుల కొండొరులయం దలి నిష్ఠురద్వేషభావములకును శాంతిపాఠము కాగలదని మనఃపూర్వకముగా ఆశించు చున్నాను.

# మన భేదాభిప్రాయములకు కారణము

(1893-వ సం. సెప్టెంబరు, 15-వ తేది)

మీ కొక చిన్న కథ చెప్పెదను. "ఒండొరులను దూషించుట మానుదుముగాక" యని యిప్పుడే తన యుపన్యాసమును ముగించిన వక్త పలుకుట మీరు వినియున్నారు; జనులలో సదా పరస్పర భేదాభిప్రాయములు ప్రబలి యుండవలసినదేనా యని యా మహనీయు డెంతయో చింతించెను.

కాని యీ భేదాభిప్రాయములకు కారణమును దెలుపు నొక కథ మీకు జెప్పుట యుక్తమనుకొందును. ఒక నూతిలో నొక కప్ప యుండెను. చాలకాలముగా నందదది నివసించుచుండెను. అందే పుట్టి యందే పెరిగియున్నను అది బుల్లి, చిన్న కప్ప. ఆ కప్పకు కన్నులు పోయినవో, లేదో మనకు జెప్పుట కచట

పరిణామవాదులు (Evolutionists) లేరు కాని మనకథకు సంబంధించినంతవఱకు దానికి కన్ను లుండినవనియే మన మంగీకరింపవలయును. మఱియు నవీనక్రిమిశాస్త్రజ్ఞులకు ఘనత నాపాదించునంతటి శక్తిసామర్థ్యములతో అది నూతియందలి పురుగులనుండియు క్రిముల నుండియు నీటిని శుభ్రమొనర్చుచుండెననియు మన మంగీకరింపవచ్చును. ఈ విధముగా కాలము గడుపుచుండ, క్రమముగా అది కొంత బలిసినది. ఇది యిట్లుండ, సముద్రమున నివసించుచుండిన మఱియొక కప్ప వచ్చి యొకనాడా నూతిలో పడుట తటస్థించెను.

"నీ వెక్కడనుండి వచ్చుచున్నావు?"

"సముద్రమునుండి."

"సముద్రమా! అది యెంత పెద్దది? అది నా నూతియంత పెద్దదా?" ఇట్లనుచు

ఈ వైపునుండి యా వైపున కది చెంగున దుమికినది.

అది చూచి సముద్రపుకప్ప యిట్లనినది : "మిత్రమా, నీ చిన్ననూతితో సముద్రము నెట్లు పోల్పగలవు?"

అంతట నూతికప్ప మఱియొకసారి దుముకి, "మీ సముద్ర మింత పెద్దదా?" యనెను.

"ఏమి యర్థరహితప్రలాపము! సముద్రమును నీ నూతితో పోల్చుటా!"

నూతికప్ప యిట్లు సమాధానించెను : "నా నూతికంటె నేదియు పెద్దదై యుండజాలదు; ఇంతకంటె పెద్ద దేదైనను సరియే యుండుట యసంభవము; ఈ సముద్రపుకప్ప వట్టి 'అబద్ధపు కోరు", దీనిని తఱుమగొట్టవలయును."

ఇదియే యెప్పుడును ఉన్న చిక్కు.

నేను హిందువుడను. నా చిన్నబావిలో నేను గూర్చుండి, యావత్ప్రపంచమును నా చిన్న నూయియే యనుకొనుచున్నాను. క్రైస్తవుడు తన చిన్ననూతిలో తాను గూర్చుండి, యావత్ప్రపంచమును తన నూయియే యనుకొనుచున్నాడు. మహమ్మదీయుడు తన చిన్ననూతిలో తాను గూర్చుండి, యదియే నిఖలప్రపంచమనుకొనుచున్నాడు. మన యీ క్షుద్రావరణములను భేదించుటకుగాను అమెరికా దేశీయులగు మీరు చేయుచున్న మహాప్రయత్నమునకు మిమ్ము నే నభినందింపవలసియున్నది; మీయుద్యమము నెఱవేఱుటకుగాను భగవానుడు మీకు తోడ్పడునని నా యాశయము.

1893-వ సం. సెప్టెంబరు, 19-వ తేదిని)

# విశ్వమత మహాసభయందు జదువబడిన హిందూధర్మ ప్రకాశిని

హిందూమతము (సనాతనధర్మము), జొరాస్ట్రీయమతము, యూదియామతము ననునవి ప్రపంచమున పురాతనకాలమునుండియు నేటివఱకు నిలిచియున్న మతములు. ఇవన్నియు ప్రబలఘాతములకు గుఱియై, వాని నెదిర్చి నిలిచియుండుటచేతనే తమ అంతర్గతబలమును జాటుచున్నవి. కాని క్రైస్తవమతమును తనయం దిముడ్చుకొనజాలక సర్వవిజయియగు తనపుత్రికచే (క్రైస్తవమతముచే) యూదియామతము తనజన్మస్థానమునుండి వెడలగొట్టబడియుండ, తమ మహామతవృత్తాంతమును మనకు దెలుపుటకు కొలదిమంది పారసీకులు మిగిలి

యుండ,—ఇదియే జొరాస్ట్రీయుమత శేషము-వైదికమతము నట్టూతలూగించి, పెకలించి వేయుటకై హిందూదేశమున ననేకసంప్ర దాయము లొకదానివెంబడి నొకటి వెలువడి నవి. కాని భయంకరభూకంపమున సముద్రతీర మందలి జలము క్షణకాలము వెనుకకు మఱలి, సహస్రగుణాధికధాటితో సర్వము ముంచివేయు మహాప్రవాహమై వెలువడుచందమున వైదిక మతము తాత్కాలికముగా వెనుకకు మఱలి నను, ఈ యల్లకల్లోలము శాంతింపగనే యయ్యది-ఆ మహామాతృమతము-ఈ సంప్ర దాయముల నన్నిటిని తనలోని కాకర్షించు కొనినది, వానిని జీర్ణించుకొనినది.

భౌతికశాస్త్రజ్ఞుడు నేడు కనుగొనుచున్న విషయములు దేనికి కేవల ప్రతిధ్వనులుగా దోచునో, యట్టి వేదాంతతత్త్వశాస్త్రము

నందలి మహోన్నతాధ్యాత్మిక తత్త్వములు మొదలుకొని నానావిధపురాణములను ఆధారముగా గొను నికృష్టమగు విగ్రహారాధనభావములపర్యంతము, సమస్తాశయములకును బౌద్ధుల అజ్ఞేయవాదమునకును జైనుల నాస్తికవాదమునకును సైతము హిందూమతము (సనాతన ధర్మము) తావొసగుచున్నది.

నానాదిశలకును బ్రసరించునట్టి యీ విభిన్న మార్గములన్నియు కలియునట్టి కేంద్రస్థానమేది యనునది యిపుడు వెలువడు ప్రశ్న. అత్యంతము పరస్పరవిరుద్ధములుగా దోచు వీని కన్నిటికిని సమానాధారభూతమగు స్థానమేది? ఇదియే నేను సమాధానింప బ్రయత్నించు ప్రశ్న.

తత్త్వావిష్కరణమూలమున — వేదముల మూలమున—హిందువులు తమ ధర్మమును బడసియున్నారు. వేదములు ఆద్యంతరహితము

లని వారు నమ్ముదురు. ఒక గ్రంథ మెట్లాద్యంత రహితమై యుండగలదని యీ సభవా రెంచ వచ్చును. అది మీకు హాస్యాస్పదముగా దోచవచ్చును. కాని వేదములనుటచే ఏ గ్రంథ ములును ఉద్దిష్టములు కావు. వేదములనగా వివిధవ్యక్తులచే వివిధసమయములందు గను గొనబడిన ఆధ్యాత్మికనియమనిక్షేపమని యభి ప్రాయము. గురుత్వాకర్షణనియమము, అది కనుగొనబడుటకు ముందును ఉండినరీతినే, మఱియు మానవకోటియంతయు దానిని మఱచి నను ఆ నియమము ఉండురీతినే, ఆధ్యాత్మిక ప్రపంచమును పరిపాలించు నియమములును శాశ్వతముగా నుండును. ఒక జీవికిని మఱియొక జీవికిని, జీవాత్మకును పరమాత్మకును గల నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక సంబంధ బాంధవ్య ములు లోకముచే గనుగొనబడుటకు పూర్వ

మును ఉండినవి, మనము వానిని మఱచినను అవి నిలిచియే యుండును.

ఈ నియమములను లేక, తత్త్వములను గనుగొనినవారు ఋషులనబడుదురు. వారిని మేము పరిపూర్ణులనుభావమున బూజింతుము. వారిలో నుత్తమోత్తము లనదగువారియందు కొందఱు స్త్రీలని యీ సభవారికి దెలుపుట నా కానందదాయకము.

ఈ నియమములకు అంతమనునది లేదని భావించినను ఆది యనునదొకటి యుండవలయు నని మీరు చెప్పవచ్చును. సృష్టి ఆద్యంతరహిత మని వేదములు మనకు బోధించుచున్నవి. విశ్వ శక్తి మొత్తముమీద ఎప్పుడును ఒక్కటే యని భౌతికశాస్త్రము నిరూపించినట్లు చెప్ప బడుచున్నది. అగుచో, నేదియు లేని సమయ మొకటి యుండియున్నచో, వ్యక్తమగుచున్న

యీ శక్తియంతయు నెచట నుండెను? భగవంతునియం దవ్యక్తముగా - గర్భితముగా - నుండినదని కొందఱు చెప్పుదురు. ఈ పక్షమున భగవంతు డొకప్పుడు చలనరహితుడుగను మఱియొకప్పుడు చలనసహితుడుగను ఉండునని, యనగా సవికారుడని భావింపవలసి వచ్చును. మార్పు చెందెడి ప్రతివస్తువును మిశ్రపదార్థము. ప్రతి మిశ్రపదార్థమును నాశమనెడి మార్పును పొందక తప్పదు. కావున భగవంతుడును నశించుననవలయును. కాని యిది యసంగతము. కావున సృష్టి లేని సమయ మెపుడును లేదని తేలుచున్నది.

దీనినే యుపమానముతో జెప్పనెడల, సృష్టియు సృష్టికర్తయు నొండొంటిననుసరించు బోవు నాద్యంతరహితమైన రెండు సమాంతర రేఖ లనవచ్చును. విలయావస్థనుండి యెవ్వని

శక్తిచే నసంఖ్యాకమైన బ్రహ్మాండములు వెలువడుచు, కొంత కాలము సాగుచు, మఱల విలయము నొందుచున్నవో, యట్టి నిరంతర కార్యదక్షుడగు విధాతయే భగవంతుడు. "ఈ సూర్యుని, ఈ చంద్రుని పూర్వకల్పములందు వలెనే విధాత సృజించియున్నాడు" *— బ్రాహ్మణబాలకుడు ప్రతిదినము ఈ మంత్రము నుచ్చరించును.

ఇచట నిలుచుండిన నేను కన్నులు మూసికొని, "నేను," "నేను," "నేను"—అని నా యస్తిత్వమునుగూర్చి భావింప బ్రయత్నించు నెడల నాకు దోచుభావమేమి? శరీరభావము. అగుచో, నేను కేవలము భౌతికపదార్థసంయోగ

---

* "సూర్యచంద్రమసౌ ధాతా యథాపూర్వమకల్పయత్." —నారాయణోపనిషత్తు, 1. 1. 14.

ము నేనా? "కాదు" అని వేదములు ఘోషించు చున్నవి. నేను శరీరమున నధివసించియున్న యాత్మను. శరీరము కాను. శరీరము నశించు చున్నది. కాని నేను నశింపను. ఈ శరీర మున నిపుడి చటనున్నాను ; ఇది పతనమగును, కాని నేను జీవించియే యుందును. నేను భూతకాలమునను ఉంటిని. ఆత్మ సృష్టింప బడిన వస్తువు కాదు, ఏలన సృష్టియనగా కొన్ని తత్త్వముల సంయోగ మనియు నిక ముందెన్నడో యొకప్పుడవి వియోగము, లేక విలయము నొందు ననియు భావము. ఆత్మ సృజింపబడి యున్నచో, అది నశించి తీర వలయును. కొందఱు ఆగర్భసుఖవంతులై యుందురు; సుందరశరీరములతో, మనోదార్ఢ్య ములతో, అభీష్టసిద్ధులై పరిపూర్ణారోగ్యము ననుభవించుచుందురు. ఇతరు లాగర్భదుఃఖ

తులై యుందురు. కొందఱు కాలుసేతులు లేనివారై యుందురు, మఱికొందఱు శుద్ధ అవివేకులై పరమనిర్భాగ్యులై మనుచుందురు. వీరందఱును సృజింపబడినచో, కరుణామయుడును ధర్మస్వరూపుడునగు భగవంతు డొకనిని సుఖవంతునిగను మఱియొకనిని దుఃఖితునిగను ఏల సృజింపవలయును? భగవంతుని కంతటి పక్షపాతమేల? ఈజన్మమున దుఃఖితులైయున్నవారు రాబోవు జన్మమున సుఖవంతులై యుందు రనుటయు సమంజసమగు సమాధానము కానేరదు. ధర్మమూర్తియు దయామయుడు నగు భగవానుని పరిపాలనమున ఈజన్మముననైనను ఒకానొక డెందుచే దుఃఖితుడై యుండవలయును?

మనము గమనింపవలసిన మఱియొకవిషయమేమన, భగవంతుడే యిట్లు సృజించుచున్నా

డనుభావము ఈవైపరీత్యమునకు సమాధానము
కాకుండు టట్లుండ, సర్వశక్తిమంతుడగు నొకా
నొకని క్రూరశాసన మిటు లున్నదని ప్రతిపా
దించుట యగును. అగుచో, ఒకనిని సుఖవం
తునిగాగాని, దుఃఖతునిగాగాని చేయుటకు వాని
జన్మమునకుపూర్వమే కారణము లుండియుండ
వలయును, అవి వాని పూర్వకర్మములు.

శారీరమానసిక ప్రవృత్తు లన్నిటికిని పరంప
రానుగతమగు స్వభావమే కారణము కాదా!
ఒండొంటిసరసను వ్యక్తమగునవి మనస్సు,
జడము, లేక ప్రకృతియు నను రెండు తత్త్వ
ములు కలవు. మనము పొందియున్న వాని
కన్నిటికిని జడమును తత్పరిణామములునే
కారణభూతమైనచో, ఆత్మయనున దొకటి
కలదని భావింపనక్కఱయే లేదు. కాని భావన
యనునది జడమునందుండి పరిణమించిన దని

నిరూపితము కాజాలదు. మఱియు తత్త్వ
శాస్త్రప్రసిద్ధమగు నేకత్వము గలదని భావింపక
తప్పనిచో, ఆత్మసంబంధమగు నేకత్వము కలదని
భావించుట నిశ్చయముగా యుక్తియుక్తము;
భౌతికైకత్వభావన కంటెను ఇది విశేష
వాంఛనీయము, సమంజసము; కాని వీనిలో
దేనితోడను మన కిచట ప్రసక్తి లేదు.

వంశపారంపర్యమువలన శరీరములకు గొన్ని
ప్రత్యేకప్రవృత్తు లబ్బుచుండు నని మన
మంగీకరింపక తప్పదు, కాని యీ ప్రవృత్తు
లనగా, ప్రత్యేక మనస్సు ప్రత్యేక మార్గ
మున దేనిమూలమున వర్తింప గలుగునో
యట్టి శరీరాకృతి లేక శరీర నిర్మాణ మని
భావము. జీవికి తనపూర్వకర్మములచే గలుగు
విచిత్రమైన యితర ప్రవృత్తులును కలవు. ఒకా
నొకప్రవృత్తి గల జీవి దానిని వ్యక్తమొనర్ప

నేది అత్యంతార్థ్వామైయుండునో, సాదృశ్యనియ
మముల ననుసరించి, యట్టి శరీరమున జన్మిం
చును. ఇది శాస్త్రానుగుణమగు విషయము.
ఏలన శాస్త్రము (Science) అభ్యాసము
నాధారముగా గొని యన్నిటిని విశదీకరింప
బ్రయత్నించును. అభ్యాసమో, అనేకపర్యాయ
ములు ఒక పనిని జేయుటచే సిద్ధించుచున్నది.
కావున నప్పుడు పుట్టిన బిడ్డయందు గాన్పించు
స్వతస్సిద్ధమైన యలవాటుల కిట్టి యావృత్తు
లావశ్యకమని చెప్పవలసియున్నది. అవి ప్రస్తుత
జన్మమున నలవడినవి కాకుండుటచే పూర్వ
జన్మానుగతములై యుండవలయును.

మఱియొక సమాలోచనీయవిషయము :
వీని నన్నిటిని వాస్తవమని యంగీకరించినను,
నా పూర్వజన్మమునుగూర్చి నాకేమియు జ్ఞప్తి
లేకుండుటకు కారణమేమి? దీనికి సమాధా

నము సులభము. నేనిపు డాంగ్లము మాట లాడుచున్నాను. ఇది నా మాతృభాష కాదు. నిజముగా నా మాతృభాషాపదము లేవియు నిపుడు నా స్మృతిపదమున భాసించుట లేదు. కాని వానిని వెలువరుచుటకు ప్రయత్నింప నిందు, అవి చొరబడి వచ్చును. ఎఱుక యను నది మానససాగరమునకు కేవలము ఉపరిభాగ మనియు మన యనుభవములన్నియు ఆ సాగర గర్భమున సంగ్రహింపబడియున్నవనియు దీని వలన విశదమగుచున్నది. యత్నించితిరా, తీవ్ర ముగా ప్రయత్నించితిరా, అవి మఱల వెలు వడును; అపుడు పూర్వజన్మము సైతము మీ కెఱుకపడును.

ఇది ప్రత్యక్షప్రమాణసిద్ధము. ఏ సిద్ధాంత మునకైనను, వాదమునకైనను, పరిశీలనమే విశేష ప్రమాణభూతము. ఋషు లిందఱి

సత్యము నరయుడని లోకము నాహ్వానించు
చున్నారు. స్మృతి యను సముద్రమును మథించి
యందలి నిగూఢవిషయములను దేనిచే
వెలువరింపనగునో, ఆ రహస్యమును మేము
కనుగొంటిమి. దీనిని శోధింపుడు,—ఈ యుపా
యమును అవలంబించి చూడుడు, మీ పూర్వ
జన్మమునుగూర్చి మీకు సంపూర్ణస్మృతి కలుగ
గలదు.

విషయ మిట్టిది. కావుననే హిందువుడు
తాను ఆత్మనని విశ్వసించును. వానిని (ఆత్మను)
కత్తులు నఱుకజాలవు - అగ్ని దహింపజాలదు-
నీరు తడుపజాలదు - వాయువు ఎండింపజాలదు*
ప్రతి జీవాత్మయు, దేని కైవారము ఎచటను

* నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః,
నచైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః.
—భగవద్గీత, 2. 23;

లేకున్నను, దేని కేంద్రము శరీరమున నెలకొని యున్నదో యట్టివృత్తమనియు మరణ మనగా ఈ కేంద్ర మొక శరీరమునుండి మఱియొక శరీరమునకు మారుటయే యనియు హిందువులు విశ్వసింతురు. మఱియు ప్రకృతిసంబంధములగు నుపాదులచేగాని, యవస్థలచేగాని, యాత్మ బద్ధముకాదు. స్వతస్సిద్ధముగా ఆత్మముక్తము, అనంతము, అపాపవిద్ధము, విశుద్ధము, పరిపూర్ణము. కాని తాను ప్రకృతిబద్ధమై యున్నట్లును జడమై యున్నట్లును ఆత్మ యెట్లో తలచుచున్నది.

ముక్తము, పరిపూర్ణము, శుద్ధమునగు తత్త్వ మెందుల కీ విధముగా ప్రకృతిబద్ధమై యుండవలయుననునది యిపుడు వెలువడు శంక. పరిపూర్ణమగు ఆత్మ తానెట్లపరిపూర్ణమని భ్రాంతి నొందగలుగును? హిందువు

లీ శంకను తప్పించుకొనజూచుచు, నిట్టిశంకయే అసంభవమని పలుకునట్లు వినుచున్నాము. ఏకమో, యనేకమో, యసంపూర్ణమగు తత్త్వములను ప్రతిపాదించుచు, కొంద ఱాలోచనాపరులు సమాధానము చెప్పజాలని తావున పెద్ద పెద్ద పారిభాషికపదముల నుపయోగించుచు, ఈశంకకు సమాధానము చెప్ప జూచుచుందురు. కాని నామకరణము విశదీకరణము కానేరదు. శంక యెప్పటివలె నిలిచియే యుండును. పరిపూర్ణమగు తత్త్వము అపరిపూర్ణము కాగలుగు టెట్లు? విశుద్ధము, అఖండము నగు తత్త్వము లేశమైనను తనస్వభావమున మార్పునొందు టెట్లు? కాని హిందువుకు నిష్కపటి. హేత్వాభాసమును శరణుజొచ్చుటకు—మసి పూసి మారేడుకాయ జేయుటకు — అతను సమ్మతింపడు. అత డీ ప్రశ్న నెదుర్కొన

జాలు ధీరుడు, ధీరపద్ధతి నాత డిందుల కిట్లు సమాధానించును: "నాకు దెలియదు. పరి పూర్ణతత్త్వమగు ఆత్మ తా నసంపూర్ణమై యున్నట్లు, ప్రకృతిబద్ధమై, తదధీనమైయున్న ట్లెందుకు తలచుచున్నదో నాకు తెలియదు." కాని, అనుభవసిద్ధమగు దానిని కాదన జాలము. తాను శరీరమనని భావించుచుండుట ప్రతివ్యక్తికిని తెలిసిన విషయమే. ఎవ్వడుగాని తాను శరీరమనని యేల తలచుచున్నాడను ప్రశ్నకు హిందువుడు సమాధానింప బ్రయ త్నింపడు. అది భగవదిచ్ఛ యనుట సమా ధానము కానేరదు. "నాకు దెలియదు" అనుటకంటె హిందువుడు తెలుపునది మఱి యొకటికాదు.

విషయమిది. జీవాత్మ నిత్యము, మృత్యు రహితము, పరిపూర్ణము, అనంతమునై వెలయు

చున్నది; మరణమనగా కేవల మొకశరీరమును విడిచి మఱియొకశరీరమును దాల్చుటయని భావము. మానవుని వర్తమానస్థితి వాని పూర్వ కర్మఫలితము. ప్రస్తుతకర్మములు భావిదశను నిర్ణయించును. జననమరణముల నందుచు, జీవి వికాసమునుగాని సంకోచమునుగాని పొందు చుండును. కాని యిచట మఱియొక శంక వెలువడును: మానవుడు ఝంఝామారుత మున సాగరతరంగములందు గతి గానక కొట్టు కొనుచుండు చిన్నదోనెయా?—నురుగులను వెలిగ్రక్కుచు, పొంగి పొరలివచ్చు కెరటము లచే ఒకక్షణమున మీఁది కెత్తబడుచు నుత్తర క్షణమున నగాధమున విసరికొట్టబడుచుండు చిన్ననావయా? యనివార్యమై సదా విజృం భించు కార్యకారణప్రవాహమున — పుణ్య పాప కర్మాధీనమై, శక్తిహీనమై, నిస్సహాయమై,

విదీర్ణమై, యటునిటు నూగిసలాడు నౌకయా?_ వితంతువుల కన్నీటిని అనాథశిశువుల విలాపములను గమనింపక, సర్వమును చూర్ణము చేయుచు పరిభ్రమించు కార్యకారణచక్రము క్రింద బడవేయబడు క్షుద్రకీటకమా? విషయమును దలచిన, గుండె జల్లుమనును, కాని ప్రకృతినియమ మిటులున్నది. "ఆశ లేదా?" "శరణోపాయము లేదా?"—యని నిరాశాహతహృదయాంతరాళమునుండి యా క్రందనము వెలువడినది. అది కరుణాపయోనిధికి వినబడినది, తోడనే యాశాజనక-అభయవాక్కులచే ప్రేరితుడై వేదఋషి విశ్వము నెదుట నిలిచి, జలదగంభీరస్వరమున నిట్లు చాటెను: "దివ్యలోక నివాసులగు నో యమృతపుత్రులారా! వినుడు: అజ్ఞానాంధకారమున కవ్వల వెలుగొందు పరమపురుషుని గనుగొంటిని;

వానిని గనుగొనుటవలననే మీరు మృత్యువు నుండి తరింతురు; వేఱు మార్గము లేదు.'' *

''అమృతపుత్రులు'—ఆహా! యేమి మధుర వాక్య! ఏమి ఆశాజనకమగు దివ్యనామము! సోదరులాలా! ఈ నామమున — అమృత పుత్రు లనెడి నామమున — మిమ్ము పిలువ నిండు, నిజముగా హిందువులు మిమ్ము పాపులన నిరాకరింతురు. మీరు భగవంతుని బిడ్డలు, అమృతసంతానము, పావనులు, పరిపూర్ణులు. భూదేవతలు మీరు, — పాపులా? మానవుని పాపి యనుటయే పాతకము; మానవ స్వభావ

---

* ''శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రా, ఆయే ధామాని దివ్యానితస్థుః. (శ్వేతాశ్వతరోపనిషత్తు, 2.5.) వేదాహమేతం పురుషం మహాంతం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్, తమేవవిదిత్వాతిమృత్యుమేతి నాన్యఃపంథా విద్యతేఽయనాయ.'' —అందే, 3. 8.

మున కపకీర్తి దూషణము. ఓ సింహములారా! వెలువడుడు, గొఱ్ఱెలమను భ్రాంతిని విడనాడుడు; మీ రమృతజీవులు, ముక్తాత్మలు, శాశ్వతానందమయులు; జడ ప్రకృతి కాదు మీరు; శరీరములు కారు; ప్రకృతి మీ దాసురాలు; అంతియే కాని ప్రకృతికి మీరు దాసులు కారు.

కావున సారాంశ మిది: వేదములు ప్రకటించునవి మనలను బంధించు ఘోరశాసనములు కావు; అంతులేని కార్యకారణ కారాగారము గాదు; "ఎవ్వనియాజ్ఞచే వాయువు వీచునో, అగ్ని దహించునో, మేఘుడు వర్షించునో, మృత్యువు ప్రాణులను గ్రసించునో"*

---

* "భీషాఽస్మాద్వాతః పవతే, భీషోదేతి సూర్యః, భీషాఽస్మాదగ్నిశ్చేంద్రశ్చ, మృత్యుర్ధావతి పంచమ ఇతి." —తైత్తిరీయోపనిషత్తు; 2. 8. 1.

యట్టి పరమేశ్వరుడీ సమస్తప్రకృతినియమములకు నధీశుడై, ప్రతిపరమాణువునందును ప్రతిశక్తియందును వెల్గొందుచున్నాడని వేదములు చాటుచున్నవి.

అగుచో వాని (పరమేశ్వరుని) స్వభావమేమి? తత్త్వమేమి?

నిర్మలుడు, నిరాకారుడు, సర్వశక్తిమంతుడు, దయామయుడు నగు నాతడు సర్వోపగతుడు, సర్వాంతరాత్మ. "నీవే మాతండ్రివి; నీవే తల్లివి; నీవే మాప్రియసఖుడవు; నీవే సర్వశక్తిమూలము; మాకు బలము ననుగ్రహింపుము.* ప్రపంచభారమును నీవు వహించు

---

* "త్వమేవ మాతా చ పితా త్వమేవ, త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ, త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ, త్వమేవ సర్వం మమ దేవ దేవ."

—ప్రపన్నగీత, 28.

చున్నావు, సంసార మనెడి యీ అల్పభార
మును వహింప నాకు తోడ్పడుము.'' వేద
ఋషు లీ విధముగా గాన మొనర్చిరి. పరమే
శ్వరుని భజించు టెట్లు? ప్రేమమూలమున
భక్తిమూలమున. ''ప్రియతము డను భావ
మున—ఇహపరములందలి సర్వ విషయముల
కంటెను ప్రియతముడను భావమున—వానిని
భజింపవలయును.''

వేదములచే ప్రకటింపబడిన ప్రేమ
సిద్ధాంత మిదియే; భగవదవతారమూర్తి యని
హిందువులు విశ్వసించు కృష్ణుడు దీని నెట్లు
పరిపుష్ట మొనర్చి లోకమునకు బోధించెనో
చూతము.

నీటిలో పెరుగుచున్నను దానిచే తడుప
బడని తామరాకువలె నరుడు సంసారమున

మెలగవలయునని యాతడు బోధించెను; *
చేతులార కర్మ మొనర్చుచుండియు మనసార
భగవంతుని స్మరించుచు మానవుడు సంసార
మున మెలగవలయును.

ఐహిక ఫలకాంక్షతో గాని, యాముష్మిక
ఫలకాంక్షతో గాని భగవంతుని భజించుట
మంచిదే, కాని యంతకంటె నిర్హేతుకముగా
భగవంతుని భజించుట మేలు. అట్టివాని ప్రార్థన
మిట్లుండును: "జగదీశ్వరా! నాకు ధనము
వలదు; సంతానము వలదు; సుందరులు వలదు;

---

* బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః,
లిప్యతే న స పాపేన పద్మపత్ర మివాంభసా.

తా. ఎవడు కర్మములను బ్రహ్మార్పణ మొనర్చి యాసక్తి
విడిచి వాని ననుష్ఠించుచుండునో, అట్టి పురుషుడు
తామరాకున నీళ్లు అంటనిరీతిగా పాపముచే స్పృశింప
బడడు. —భగవద్గీత, 5. 10.

పాండితి వలదు; నీయిచ్ఛయగునేని, ఎన్ని జన్మములనైన నెత్తుటకు సంసిద్ధుడను; కాని జన్మజన్మాంతరములందును నాకు వలయునది నీయందలి యహేతుకభక్తియే."* శ్రీకృష్ణుని శిష్యుడును నాటి భారతదేశ సార్వభౌముడును నగు యుధిష్ఠిరుడు శత్రువులచే పరాజితుడై, రాజ్యమును గోలుపోయి, భార్యతో హిమాలయ పర్వతములందొక యరణ్యమున రక్షణ మొందవలసి వచ్చెను. "పరమ ధార్మికులగు మీరింతటి బాధల నేల యనుభవింపవలయును?" అని రాణి యొకనాడాతని ప్రశ్నించెను. యుధిష్ఠిరుడిట్లు సమాధానించెను:

---

* "న ధనం న జనం న సుందరీం కవితాం వా జగదీశ కామయే, మమజన్మని జన్మనీశ్వరే భగవత్యద్భక్తిరహైతుకీ త్వయి."

—శ్రీకృష్ణచైతన్యవిరచితము, శిక్షాష్టకము, 4.

ప్రాణేశ్వరీ! హిమాలయపర్వతముల నవలో కింపుము. అవి యెంత దివ్యముగా, రమణీయ ముగా నున్నవో! వానియందు నాకు ప్రీతి. అవి నాకేమియు నీయవు, కాని దివ్యము, మనోజ్ఞమునగు దానియందు ప్రీతి వహించుట నాస్వభావము, కావుననే వీనియందు నాకు ప్రీతి. ఇట్లే భగవంతునియందు నాకు ప్రీతి. సమస్త సౌందర్యమునకును సమస్త మహత్వ మునకును భగవంతుడు మూలము. భగవంతు డొక్కడే ప్రేమింపదగినవాడు; వానిని ప్రేమిం చుట నాస్వభావము, కావుననే ప్రేమింతును. దేనికోసముగాని నేను ప్రార్థింపను; దేనినిగాని యర్థింపను. భగవంతుడు తన యిచ్ఛవచ్చిన చోట నెచ్చటనైనను, నన్నుంచుగాక. అహేతుకముగా భగవంతునియం దనురక్తి కలిగియుండుటయే నా విధి. లాభనష్టములను

గణించుచు, ప్రేమ యను ద్రవ్యముతో నేను వర్తకము చేయజాలను.''*

ప్రకృతిబద్ధుడై యున్నను జీవుడు బ్రహ్మ స్వరూపుడని వేదములు బోధించును ; ఈ బంధము విచ్ఛిన్నమైనంతనే పరిపూర్ణత లభించును, కావున ఈ బంధవిచ్ఛేదనమునకు వేద

---

* ''నాహం ధర్మఫలాకాంక్షీ రాజపుత్రి చరామ్యుత, దదామి దేయమిత్యేవ యజే యష్టవ్యమిత్యుత. ధర్మ ఏవ మనః కృష్ణే స్వభావాచ్చైవ మేధృతమ్, ధర్మ వాణిజ్యకో హీనో జఘన్యో ధర్మవాదినామ్.''

—మహాభారతము, వనపర్వము, అ. 31.

తాత్పర్యము :—''రాజపుత్రీ! నేను ఫలమును గోరి ధర్మము నాచరించుట లేదు. ఈయదగిన దను బుద్ధిలో దాన మొసగుచున్నాను. యజింపదగిన దను బుద్ధిలో యజ్ఞమొనర్చుచున్నాను ; కృష్ణుని ధ్యానించుట ధర్మమను భావమున స్వాభావికముగనే యటు లాచరించుచున్నాను. ధర్మము నమ్ముకొని బ్రదుకువాడు నీచుడు, ధర్మవాదులం దధముడు.''

ములు "ముక్తియనుపదము నుపయోగించును —ముక్తి యనగా అపరిపూర్ణత, దుఃఖము, మరణము ననెడి బంధములనుండి విమోచనము.

ఈ బంధములు భగవత్కృపచే తొలగును, ఆ కృపాకటాక్షము నిర్మలాత్ములపై ప్రసరించును. కావున భగవదనుగ్రహమును బడయవలయుననిన, మానవుడు వినిర్మలహృదయుడై యుండవలయును. ఆ యనుగ్రహ మెట్లు లభించును? భగవానుడు విశుద్ధాత్ములకు సాక్షాత్కరించును; అకలంకులే భగవంతుని గాంతురు —ఈ జన్మముననే గాంతురు. అపుడే హృదయమునందలి కౌటిల్యమంతయు నశించును; అపుడే సమస్తసంశయములును తొలగును.*

* "భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః,
క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే."
—ముండకోపనిషత్తు, 2. 2. 7.

ఘోరమగు కార్యకారణనియమమున కిక నాత
డెంతమాత్రము నధీనుడు కాడు. ఇదియే
హిందూమత ముఖ్యాభిప్రాయము; సనాతన
ధర్మహృదయము. మాటలను సిద్ధాంతములను
బట్టుకొని హిందువుడు ప్రాకులాడగోరడు. అతీం
ద్రియతత్త్వ మేదియైనను కలదనినచో నాతడు
దానిని తాను ముఖాముఖని కనవలయుననును.
జడముకంటె భిన్నమగు నాత్మ తనయందు
కలదనినచో, దయామయుడగు పరమేశ్వరు
డనువాడొకడు కలడనినచో, తానాయాత్మను,
ఆ పరమేశ్వరుని ప్రత్యక్షముగా దర్శింప
బూనును. అత డాత్మను కనవలయును; ఆత్మ
దర్శనముననే సమస్తసంశయములును తొల
గును. "నే నాత్మను గాంచితిని, పరమేశ్వరుని
గాంచితిని" — అను ననుభవమే యాత్మను
గూర్చి, భగవంతునిగూర్చి హైందవఋషి

గణించు పరమప్రమాణము. ఇది యొక్కటియే మోక్షనియమము. హిందూమతము—సనాతనధర్మము-ఏ వాదమునో, ఏ సిద్ధాంతమునో నమ్మవలయుననెడి ప్రబలప్రయత్నములతో గూడుకొనియుండునట్టిది కాదు; అనుభూతియే, యాత్మస్థితియే సనాతనధర్మతత్త్వము; విశ్వాసము కాదు. ఇట్లు నిరంతరసాధనవలన పరిపూర్ణతను బడయుటయే, మోక్షమును బొందుటయే, భగవంతుని ప్రాపించుటయే, భగవంతుని గనుటయే హిందూమత ముఖ్యోద్దేశము; ఈ భగవత్ప్రాప్తి, భగవత్సాక్షాత్కారము, పరమపిత (Father in Heaven) యొక్క పరిపూర్ణతను బడయుట — ఇదియే హిందూమతము; సనాతనధర్మము.

పరిపూర్ణతను—మోక్షమును— బొందిన వానిస్థితి యెట్టిది? ఆత డఖండానందమయుడై

మనుచుండును. పరమకామ్యమగు వస్తువును, అనగా భగవానుని బొంది యాత డనంతము, అఖండమునగు నానందము ననుభవించుచుండును, — భ గ వా ను ని తో నిరతిశయానందము ననుభవించుచుండును.

ఇంతవఱకు దెలుపబడిన విషయములను హిందువులందఱును నంగీకరింతురు. భారతదేశమందలి సర్వసంప్రదాయములకును నిది సామాన్యధర్మము; కాని పరిపూర్ణతయనునది యఖండము; అఖండమగు వస్తు వొక్కటియే గాని రెండుమూడై యుండజాలదు. దాని కట్టి గుణములును నుండజాలవు. అదియొకవ్యక్తియై యుండజాలదు. కావున జీవుడు పరిపూర్ణుడును అఖండుడును నగునపుడు బ్రహ్మములో ఐక్యము నొందవలయును, అపుడు తన స్వభావాస్తికత్వములయొక్క పరిపూర్ణతను సత్వతః

మును పరమేశ్వరుడు కలిగియున్నట్లు, అఖండ సచ్చిదానందస్వరూపుడై యున్నట్లు జీవుడు తెలిసికొనును. ఈ పరమేశ్వరైక్యమును—ఈ బ్రహ్మైక్యమును-జీవుడు తనవ్యక్తిత్వమును గోల్పోయి టాయియో, అప్పయో, లేక స్థాణువో యగునట్లు పలువురు చెప్పుచుండుట తఱచు వినుచుందుము.

"తిననదే రుచి తెలియదు, దిగనిదే లోతు తెలియదు."

జీవబ్రహ్మైక్యము టాయి, అప్ప మొదలైనవానిస్థితివంటి దెంతమాత్రము కాదని గ్రహింపుడు. ఈ యల్పశరీరసంబంధమగు నెఱుకయే యానందానుభవమగుచో, రెండు శరీరములకు సంబంధించునట్టి యెఱుక యంతకంటె విశేషానందానుభవమై యుండవలయును; బహుశరీరములకు సంబంధించు

నపు డంతకంటెను విశేషమైయుండును; అది
విశ్వప్రజ్ఞయై యుండునపు డానందపరమా
వధియై దీపించును గదా!

కావున ఈ విరాడ్వ్యక్తిత్వమును బడయు
టకు శరీర మనెడి పంజరమున బంధింపబడి
యున్న యీ క్షుద్రవ్యక్తిత్వ మంత మొంద
వలయును. జీవనముతో నేను ఐక్య మొందు
నపుడే మరణ మంతరింపగలదు; ఆనందముతో
నేను ఐక్యమొందునపుడే దుఃఖ మంతరింప
గలదు; జ్ఞానముతో నేను ఐక్యమొందునపుడే
సమస్త భ్రమలును నంతరింపగలవు; ఇది
యనివార్యమగు శాస్త్రసిద్ధాంతము. భౌతిక
వ్యక్తిత్వమనునది భ్రాంతియనియు, నవిచ్ఛిన్న
పదార్థసాగరమున నిజముగా నా శరీరము
నిరంతరము మార్పునొందుచున్న చిన్న వస్తు
వనియు, నా ప్రతిరూపమగు నాత్మతో ఐక్యము

నొందుట విధాయకమనియు భౌతికశాస్త్రము నాకు నిరూపించుచున్నది.

శాస్త్రమనగా నేకత్వగ్రహణముకంటె మఱియొకటి కాదు. పరిపూర్ణమగు ఏకత్వమును ప్రాపించినంతనే—అదియే గమ్యప్రాప్తి కావున—శాస్త్రముయొక్క పురోగమనము నిలిచిపోవును. ఎందుండి యితరపదార్థములన్నియు నిర్మాణమొందగలవో యట్టి మూలపదార్థమును గనుగొనుటలో రసాయనశాస్త్ర (Chemistry) పురోగమనము పరిసమాప్తమగును. ఎందుండి యితరశక్తు లన్నియు వెలువడుచున్నవో యట్టి యేకశక్తిని గనుగొనినచో, పదార్థవిజ్ఞానశాస్త్రము (Physics) తన పరిశ్రమను సఫలమొనరింపగలుగును; నశ్వరమగు ప్రపంచమున నెవ్వ డనశ్వర చైతన్యస్వరూపుడో, యీ సవికారవిశ్వమున కెవ్వడు

శాశ్వతాధారభూతుడో, సమస్తజీవులను నవ్యనిమాయారూపములో, యట్టిపరమాత్మని గనుగొనినచో మతశాస్త్రము (Science of Religion), లేక బ్రహ్మవిద్య పరిసమాప్తిని బొందును. ఈవిధముగా నానాత్వమూలము నను ద్వైతమూలముననుపరమైక్యము (అద్వైతము) ప్రాప్య మగుచున్నది. ఇదియే సమస్తమతములకును - సమస్తధర్మములకును - పరమావధి. ఇదియే సకలశాస్త్రగమ్యము.

సమస్తశాస్త్రములును పర్యవసానమున ఈ సిద్ధాంతమునకు రాకతప్పదు. భౌతికశాస్త్రము (Science) నేడు ప్రకటించు సిద్ధాంతము 'వ్యక్తీకరణము' (Manifestation) కాని, 'సృష్టి' (Creation) కాదు : ఇక హిందువులు యుగయుగములనుండియు దనకు హృద్గతమై యొప్పు సిద్ధాంతములే పటుతరభావయందు,

అత్యంత నవీనశాస్త్రసిద్ధాంతములతోడ్పాటున, లోకమునకు బ్రకటింపబడ నున్నవని యానందించుచున్నాడు.

తత్త్వశాస్త్రాశయములనుండి క్రిందికి దిగి యిక పామరులమతము నవలోకింతము. హిందూదేశమున బహుదేవతారాధనము అనునది లేనే లేదని మొట్టమొదటనే నేను చెప్పవచ్చును. ఎవరైనను సమీపమున నిలిచి యాలకించిన, ప్రతి దేవాలయమునను ఆరాధకులు విగ్రహములకు సర్వవ్యాపకత్వముతోబాటు సకలవిశేషణములను అనుసంధానించుచుండుట తెలియనగును. ఇది యెన్నటికిని బహుదేవతారాధనము కానేరదు, ఏకేశ్వరుడను భావము లేకున్నను ఒకే దేవతను నమ్మి కొలుచుటయు (Henotheism) కానేరదు. "ఏ పేరు పెట్టి పిలి

చిన నేమి, గులాబి యెన్నటికిని కమ్మని తావులనే వెదజల్లుచుండునుగదా!" నామకరణము వికదీకరణము కానేరదు.

నేను బాలుడనై యుండగా, ఒకప్పుడొక క్రైస్తవప్రచారకుడు గుమిగూడియున్న కొందఱకు బోధించుచుండుట జ్ఞప్తికి వచ్చుచున్నది. ఇతర మనోహర విషయములతో బాటు ఆతడు చెప్పుచుండిన యొక విశేషమిది: "మీవిగ్రహమును నా కఱ్ఱతో బూజించిన, అది యేమిచేయగలదు"—ఇది యాతని ప్రశ్న. వినువారలలో నొకడు వెంటనే వానికి తగినట్లు, 'మీ దేవుని నేను దూషించిన, ఆత డేమి చేయగలడు!" అని ప్రశ్నించెను. "నీ మరణానంతరము శిక్షింపబడుదువు" అని ప్రచారకుడు సమాధానించెను. "నీవు చచ్చినవెనుక మావిగ్రహమును

అట్లే నిన్ను శిక్షించును'' అని హిందువుకు *
మాఱుపలికెను.

చెట్టు మంచి చెడుగులు పండ్లనుబట్టి తెలి
యును. ధార్మికజీవనమునకేమి, పారమార్థిక
సంపదయందేమి, ప్రేమానురాగములందేమి,
విగ్రహారాధకు లనబడువారిలో నేను కనుగొనిన
వ్యక్తుల కెనయగు వ్యక్తులను లోకమున
మఱెచ్చటను కనియుండని కారణమున నిరసన
మును మాని, ''పాపమునుండి పవిత్రత వెలు
వడగలదా ?'' యని ప్రశ్నించుకొనుచుందును.

మూఢవిశ్వాసము మానవునకు ప్రబల
శత్రువు, కాని స్వమతదురభిమానము—పర
మత ద్వేషము — అంతకంటె దారుణము.
క్రైస్తవు డందుచే 'చర్చి'కి (ప్రార్థనాలయ

* ఈతడు శ్రీవివేకానందస్వామియే యని స్వామి
(బాల్య) జీవితచరిత్రను జూచినచో తెలియగలదు.

మునకు) వెడలును ? శిలువ (Cross) యెందుచే పవిత్రమైనదిగా భావింపబడవలయును ? ప్రార్థన సమయమున మొగము నాకసము వంకకు త్రిప్పుకొనుటెందులకు ? క్యాథొలిక్ ప్రార్థనాలయమున (Catholic Church) అన్ని విగ్రహములు నందుల కుండవలయును ? ప్రార్థించునపుడు ప్రొటస్టెంట్ (Protestant) మతస్థుల మనసులలో అన్నివిగ్రహము లేల యుండవలయును ? సోదరులారా ! శ్వాసింపనిదే యెట్లు జీవింపజాలమో అట్లే మానసికప్రతిమ యనునది లేనిదే దేనినిగూర్చియు భావింపజాలము. సంబంధనియమము ననుసరించి భౌతిక ప్రతిమ మనోభావమును, మనోభావముభౌతికప్రతిమను వెలువరుచుచుండును. హిందువు డారాధించునపుడు బాహ్యప్రతీకము నుపయోగించుట కిదియే కారణము. తానుపాసించు దేవతపై

మనసును నిలుపుట కది తనకు తోడ్పడునని యాతడు మీకు దెల్పును.* ప్రతిమ భగవంతుడు కాదనియు, సర్వవ్యాపకము కాదనియు మీ వలెనే యాతనికిని దెలియును. ఇంతకును 'సర్వ వ్యాపకత్వము' అనుటచే ఇంచుమించుగా లోకులందఱకును గల భావ మేమి? అది వారికి కేవల మొకపదము, సంకేతము, అంతే. భగవంతుని కేమైన బాహ్యపరిమాణము, లేక విస్తీర్ణమనునది కలదా? కాకున్న, 'సర్వ వ్యాపకము' అను పదము నుచ్చరించునపుడు మనము విస్తృతిగల యాకాశమునుగూర్చియో

---

* చిన్మయస్యాప్రమేయస్య నిష్కళస్య శరీరిణః,
సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా,
—కులార్ణవతంత్రము, 6-వ ఉల్లాసము.

అగ్నిర్దేవో ద్విజాతీనాం, మునీనాం హృది దైవతమ్,
ప్రతిమా స్వల్పబుద్ధీనాం, సర్వత్ర విదితాత్మనామ్.
—అగ్నిపురాణము.

యవకాశమునుగూర్చియో, భావింతుము ; అంతే.

మనయొక్క మానసిక ప్రకృతినియమముల ననుసరించి యనంతత్వమునుగూర్చి మనకు గల భావములు నీలాకాశము యొక్కయో, సాగరముయొక్కయో, ప్రతిమతో సంబంధించినవై యుండక తప్పదు ; కావున పవిత్రతనుగూర్చి మనకు గల భావము సహజముగా ప్రార్థనాలయముయొక్కయో, మసీదు యొక్కయో, శిలువయొక్కయో ప్రతిమతో సంబంధము కలిగియుండును. పావిత్ర్యము, నైర్మల్యము, సత్యము, సర్వవ్యాపకత్వము మున్నగు వానిని గూర్చిన భావములను హిందువులు వివిధప్రతిమలతోడను ఆకృతులతోడను నన్వయించియున్నారు. కొన్ని సిద్ధాంతముల నంగీకరిం

చుట, తమవారికి తోడ్పడుట—ఇదియే తమ దృష్టిలో ధర్మము, పరమార్థమును కావున కొందరు తమ సంప్రదాయ మనెడి విగ్రహమునకు జీవితమునంతను ధారపోసి, యావిగ్రహదాస్యము నతిక్రమింపజాలని స్థితిలో నుండ, హిందూమతము—సనాతన ధర్మము—అంతయు సాక్షాత్కారమున కేంద్రీకరింపబడి యున్నది. బ్రహ్మానుభూతివలననే మనుష్యుడు బ్రహ్మము కావలయును.* విగ్రహములు, దేవాలయములు, ప్రార్థనాలయములు, గ్రంథములు—ఇవన్నియు మానవుని పారమార్థిక శైశవమున—ప్రారంభావస్థయందు — కేవల సహాయ భూతములు, ఊతగఱ్ఱలు : కాని యాతడు పురోభివృద్ధి నొందవలయును.

* "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి."

—ముండకోపనిషత్తు, 3. 2. 9.

గమ్యప్రాప్తిపర్యంతము సాధన చేయుచుండ వలసినదే. వేదము లిట్లు చాటుచున్నవి: "బాహ్యపూజ—భౌతికారాధనము — అధమము. అభ్యుదయమును బొందు ప్రయత్నమున మానసికమగు నుపాసనమధ్యమము; బ్రహ్మను భూతియేయుత్తమము."† పరికింపుడు, విగ్రహాము ముందు సాగిలబడు నిర్మలభక్తుడే యిట్లు తెలుపును: "ఆ బ్రహ్మమును లేక పరమేశ్వరుని సూర్యుడు ప్రకాశింపజేయజాలడు, చంద్రుడు గాని, తారకలుగాని, మెఱపులుగాని ప్రకాశింపజేయజాలవు, అగ్నిమాట యిక చెప్పెడిదేమి! ఆ పరమేశ్వరునిమూలముననే యివ

---

† ఉత్తమో బ్రహ్మసద్భావో ధ్యానభావస్తు మధ్యమః,
స్తుతిర్జపోఽధమాభావో బహిఃపూజాఽధమాధమా.
—మహానిర్వాణతంత్రము, 4-వ ఉల్లాసము.

న్నియు ప్రకాశించుచున్నవి.''† కాని యాత డెవ్వరివిగ్రహమును దూషింపడు, తదారాధన మును పాపమని నిరసింపడు. జీవితమున అది యొక యావశ్యకమగుదశయని యాతడు పరిగ ణించును. ''బాలకుడే మనుజునితండ్రి యగు చున్నాడు:'' బాల్యముగాని, యౌవనముగాని పాపమని వృద్ధుడు నిందింపదగునా?

విగ్రహసాహాయ్యమున నొకడు తనయందలి దైవత్వమును గ్రహింపగలుగుచో, దానిని మనము పాపమనజెల్లునా? విగ్రహారాధనస్థితిని దాటిననుగూడ దాని నాతడు తప్పనవచ్చునా?

---

† ''న తత్ర సూర్యోభాతి, న చంద్రతారకమ్
నేమా విద్యుతో భాంతి, కుతోఽయ మగ్నిః,
తమేవ భాంతమనుభాతి సర్వమ్
తస్య భాసా సర్వమిదం విభాతి.''
—ముండకోపనిషత్తు, 2. 2. 10.

సాధనయాత్రాపథమున మానవు డొకతత్త్వ
మునుండి మఱియొకతత్త్వమును—సామాన్య
తత్త్వమునుండియుత్తమతత్త్వమును గ్రహించు
చున్నాడు కాని, భ్రమనుండి సత్యమును
ప్రాపించుటలేదని హిందువుల యభిప్రాయము.
హిందువు లిట్లు పరిగణింతురు: క్షుద్రదేవతా
రాధనము మొదలుకొని పరబ్రహ్మోపాసనము
వఱకును గల సర్వమతములను అఖండసచ్చి
దానందమయుని సాక్షాత్కారము బడయుటకు
గాను మానవమానసముచేయు వివిధప్రయత్న
ములు: జన్మసంసర్గాది పరిస్థితుల ననుసరించి
యాయావ్యక్తుల కాయామార్గము లేర్పడు
చుండును: ప్రతి ప్రయత్నమును ప్రతిసాధనయు
నాత్మవికాసమున నొకానొకస్థితిని సూచిం
చును; ప్రతిజీవియు, సూర్యనారాయణుని జేరు
పర్యంతము క్రమక్రమముగా జవసత్వములను

గూర్చుకొనుచు పైకెగురుచున్న గరుడపక్షి శాబకమని చెప్పనొప్పును.

అనేకత్వమునం దేకత్వము ప్రకృతి సూత్రము; హిందువులు దీనిని గుర్తించి యున్నారు. ప్రతి ఇతరమతమును 'ఇవియే పరమసత్యము'లని యేవో కొన్ని సిద్ధాంతములను ప్రతిపాదించి, వాని నవలంబింప వలయునని సమాజమును బలాత్కరింప జూచును. "పిడుగునకును బియ్యమునకును ఒకేమంత్ర" మనునట్లు సమాజమునకంతకును ఒకేసూత్రమును విధించి, పుల్లయ్యకును ఎల్లయ్యకును ఎల్లవారికిని అదియే సరిపడవలయు ననును, సరిపడనిచో వారిపాట్లు వారివే. ద్వైతప్రపంచమూలముననే కాని యద్వితీయ పరమాత్మతత్త్వమును భావింపజాలమనియు, గ్రహింపజాలమనియు, స్థిరీకరింపజాలమనియు

ప్రతిమలు, శిలువలు, అర్ధచంద్రాకృతులు మొదలగునవన్నియు కేవలసాంకేతికములని— మన ఆధ్యాత్మికభావములను నిలుపుకొనుటకు వలయు నవలంబములని — హిందువులు కనుగొనియున్నారు. ప్రతివ్యక్తికిని ఈవిధమైన సాయ మావశ్యకమనుట కాదు; కాని యది యక్కఱలేని వారికి దానిని తప్పనుట కధికారము లేదు. హిందూమతమున — సనాతన ధర్మమున—ఇది విధాయకమును కాదు.

ఈ సందర్భమున మీకొక విషయమును జెప్పవలసియున్నది. హిందువుల విగ్రహారాధన మేమియు ఘోరమైనది కాదు. "వేశ్యామాత" (Mother of harlots) కాదు, కాని ఉన్నతాధ్యాత్మికతత్త్వములను గ్రహించుటకది అపరిపక్వహృదయులప్రయత్నము. హిందువులందు దోషములు లేకపోలేదు, లోపములు

లేకపోలేదు; కాని మీ రీ విషయమును గమ
నింపవలసియున్నది: తోడివారల గొంతుకలను
గోయుటకుగాక, తమ్ము తాము శిక్షించుకొను
టకే వా రెప్పుడును ఉద్యమించుచుందురు.
హిందూమతదురభిమాని చితిపేర్చుకొని తన్ను
తాను దహించుకొనుగాక, కాని యాత డెన్న
డును అన్యమతావలంబులను దహించుటకు
చిచ్చు రగుల్కొల్పడు. * మంత్రకత్తెలను
మంటలలో త్రోసి చంపుట క్రైస్తవమత

---

* క్రైస్తవమతసిద్ధాంతములకు వ్యతిరేకభావముల
వలంబించువారిని కనుగొని శిక్షించుటకును అట్టిభావ
ముల నణచివేయుటకును రోమన్ క్యాతొలిక్ మతసంస్థచే
Holy Office (పవిత్రకార్యాలయము) అను పేరున ఒక
న్యాయసభ స్థాపితమైయుండెడిది. ఈ న్యాయసభాశాఖ
యొకటి స్పెయిన్ దేశమున ప్రభుత్వనియంత్రణమున
15-వ శతాబ్దాంతమున (Spanish Inquisition అను
పేరున) నెలకొల్పబడెను. ఇది 16-వ శతాబ్దమున

ద్రోహము కానేరనియెడల హిందూమతదురభి
మాని చిచ్చుటికి చచ్చుటయు హిందూమత
ద్రోహము కానేరదు.

కావున ప్రపంచమందలి సకలమతములును
వివిధపరిస్థితులనుండి—స్థితిగతులనుండి—నానా
స్త్రీపురుషులును ఒకేగమ్యమును జేరుట కవలం
బించు వివిధమార్గములని హిందువులు పరిగ
ణింతురు. లౌకికమానవుని దివ్యునిగా, భగవం
తునిగా, పరిణమింపజేయుటయే ప్రతిమతము
యొక్కయు పరమాశయము. సర్వమతము
లును—సర్వధర్మములును—ఒకే భగవంతుని
వలన ప్రేరితములై వెలయుచున్నవి. అగుచో
ఇన్ని పరస్పర భేదములును ఇంత వైషమ్యము

---

స్పెయిన్, నెదర్లాండ్సు దేశములందు విజృంభించి,
భిన్నమతావలంబకులను హింసించుటకును చంపుటకును
పేరు పొందియుండెడిది.

నుండనేల? ఇన్నియు కేవలాభాసములని—పైకి దోచునవిమాత్రమేయని — హిందువుడు వచించును. ఒకేసత్యము వివిధప్రకృతులకు సంబంధించి వివిధపరిస్థితుల కనువర్తించునపుడు ఈ వైషమ్యములు వెలువడుచున్నవి.

పలురంగుల అద్దములనుండి వెలువడుచున్నది ఒకే కాంతి. సత్యము వివిధమతధర్మములకుఅనువర్తించుపట్ల ఈచిన్నచిన్నవ్యత్యాసము లావశ్యకమై యున్నవి. కాని యన్నిటి యొక్కయుహృదయమున నొకేసత్యముదీపించుచున్నది. కృష్ణావతారమున భగవానుడు హిందువుల కిట్లు చాటియున్నాడు: రత్నహారము నందలి సూత్రమువలె ప్రతిమతమునందును నేనుకలను. మానవలోకమును పావనమొనర్చి నుద్ధరించునట్టి యసాధారణపవిత్రతను అసాధారణశక్తిసామర్థ్యములను మీరెచట గాంచి

నను, నే నచట వెలయుచున్నానని గ్రహిం
పుము.''* దీని ఫలితమేమి? హిందువులుతప్ప
ఇతరు లెవ్వరును తరింపజాలరను విషయము
సంస్కృతతత్త్వశాస్త్రమునంతను గాలించినను
ఎచటనైనను కలదేమో కనుగొనుడు: లోక
మునకంతకును సవాలుచేసి చెప్పుచున్నాను.
''మా జాతిమతముల కవ్వలను బ్రహ్మవేత్తలు
కలరు''† అని వ్యాసుడు వచించియున్నాడు.

---

స్వామి యీ క్రింద శ్లోకములందలి భావము గ్రహించి యున్నాడు:

* ''మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ,
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ.''
7. 7. ''యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జిత
మేవ వా, తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశ
సంభవమ్'' 10. 41. —భగవద్గీత.

† ''అంతరాచాపి తు తద్దృష్టేః.''
—వేదాంతసూత్రములు, 3. 4. 36.

మఱియొక విషయము. ఎవ్వరి విజ్ఞానమంతయు భగవత్తత్త్వమున నెలకొనియున్నదో, అట్టి హిందువులు అజ్ఞేయవాదమును పురస్కరించుకొనియున్న బౌద్ధమతమునుగాని, నాస్తికవాదమును పురస్కరించుకొనియున్న జైనమతమునుగాని యెట్లు నమ్మగలరు!

బౌద్ధులుగాని, జైనులుగాని భగవత్తత్త్వముపై నాధారపడకున్నను తదీయమతసారమంతయు మానవుని దివ్యునిగా — భగవంతునిగా — పరిణమింపజేయవలయుననెడి సర్వమతమహామూలతత్త్వము నుపలక్షించుచున్నది 'పరమపితను' (పరమేశ్వరుని) వారు దర్శింపకున్నను 'పరమపుత్రుని' (అవతారమును) దర్శించియున్నారు. పరమపుత్రుని గనుగొనినవాడు పరమపితను గనుగొనినవాడే.

సోదరులారా! ఇదియే హిందూమతతత్త్వ సంగ్రహము. హిందువులు తమ యాశయము లన్నిటిని గొనసాగింపజాలక పోయి యుండ వచ్చును, కాని యెన్నటికైనను విశ్వమానవమత మనునదొకటి వెలయుచో, దేశకాలాతీతమై, యయ్యది తాను ప్రకటించు భగవంతునివలెనే యనంతమై వెలయవలయును; కృష్ణు ననుస రించు వారలయందేమి, క్రీస్తు ననుసరించువార లయందేమి, పావనాత్ములయందేమి, పాపాత్ముల యందేమి. యెల్లరయందును సమానముగా తదీయభానుదీప్తి ప్రసరింపవలయును; అయ్యది బ్రాహ్మణమతముగాగాని, బౌద్ధ మతముగా గాని, క్రైస్తవమతముగాగాని, మహమ్మదీయ మతముగాగాని యుండక, వీని నన్నిటిని తనయందిముడ్చుకొనుచు, నింకను వికాసము నొందుట కనంతమగు నవకాశము కలిగి

యుండవలయును; మఱియు సంసార పంకమున బొరలాడుచుండు పశుప్రాయుడు మొదలుకొని యఖండౌదార్యధీవైభవములచే, తన మానవత్వమునుగూర్చి సంశయముదయింప జేయుచు, సామాజిక భయ గౌరవాస్పదుడై, యించుమించుగా మానవకోటికంతకు నతీతుడై యుండు మహనీయునివఱకును ఎల్లరకును తావొసగి వారలను తన యనంత ప్రేమహస్తములతో నాలింగన మొనరించుకొనునట్టిదై యుండవలయును. అట్టి విశ్వమానవమతము హింసాద్వేషములకు తన వ్యవస్థయందు సుమంతయు చోటీయక, సమస్త స్త్రీపురుషులును భగవత్స్వరూపులే యని గుర్తించుచు, తన యథార్థదైవస్వభావమును గ్రహింప మానవకోటికి దోడ్పడుటయే తన ప్రధానాశయముగా గణించును.

ఇట్టి మతమును—ధర్మమును — ప్రకటింపుడు. సమస్తజాతులును మి మ్మనుసరించును. అశోకుని మతసభ బౌద్ధమత సభ. అక్బరు ఏర్పఱచిన మతసభ సర్వమత సమన్వయ దృష్టితో వెలువడినను అది కేవలము ఆస్థాన సభ. ప్రతిమతమునందును భగవంతుడు కలడని నిఖలప్రపంచమునకును జాటుట అమెరికాదేశమునకు నియమితమై యున్న మహాకార్యము.

హిందువుల బ్రహ్మము. జొరాస్ట్రీయుల (పారసీకుల) అహురమజ్ దా (లేక అర్ మజ్ద్), బౌద్ధుల బుద్ధుడు, యూదుల యెహోవా, క్రైస్తవుల పరమపిత (Father in Heaven) యునై వెల్గొందు అల పరతత్త్వము—పరమేశ్వరుడు-మీ మహత్తరసంకల్పమును గొనసాగింప మీకు శక్తిసామర్థ్యములు ప్రసాదించుగాక! (విశ్వమతైక్య) తార ప్రాగ్దిశయందుదయించి,

మందప్రకాశముతో నొకప్పుడును దివ్యతేజ
ముతో మఱియొకప్పుడును వెల్గొందుచు,
సరిగా పశ్చిమదిశ కేగి, తుదకు ప్రపంచము
నంతయు జుట్టి వచ్చి, సహస్రగుణాధిక తేజో
వంతమై మఱల ఇపుడు ప్రాగ్దిశావలయముననే
శాన్‌పో (Sanpo) నదీ ప్రాంతమున నుద
యించుచున్నది.

స్వాతంత్ర్యమాతృభూమివగు కొలంబియా,
నీకు జయము! పొరుగువారల కుత్తుకల నెన్న
డును ఉత్తరింపని నీవు, పొరుగువారిని దోచు
కొనుటయే యైశ్వర్యమును బొందుట కత్యంత
సన్నిహితమార్గమని యెన్నడును భావింపని నీవు
—సమన్వయపతాకను దాల్చి, నాగరికతా
పురోగామివగుట నీవిధివిహిత మహాకార్యము.

# హిందూదేశమందలి దురంతలోపము ధర్మము కాదు

(1893-వ సం. సెప్టెంబరు, 20-వ తేది)

క్రైస్తవు లెప్పుడును సద్విమర్శకు సంసిద్ధు లై యుండవలయును; నేను కొంచెము విమర్శ చేయుటకు మీ కేమియు నభ్యంతర ముండదని తలంతును. క్రైస్తవమత బాహ్యుల (Heathens) ను 'తరింపజేయుటకుగాను' ప్రచారకులను బంపుటకై యంతగా ఆతురపడు మీ క్రైస్తవులు- వారిని పస్తుండకుండ కాపాడుట కేల ప్రయత్నింపరాదు! కాటకములు ప్రళయతాండవము చేయుచుండ, వేలకొలది జనులు క్షుధానలమునకు గుఱియై భారతదేశమున మరణించిరి. కాని మీ క్రైస్తవులు వారి కేమియు సాయముచేసిన పాపమున బోలేదు. హిందూదేశమునం దంతటను మీరు ప్రార్థ

నాలయములను (Churches) కట్టుచుందురు, కాని ప్రాచ్యదేశములందలి దురంతలోపము ధర్మము కాదు, పరమార్థము కాదు—వారికి కావలసినంత పారమార్థికచింత కలదు—కడుపులు కాలిపోవుచుండ, బొంగురుపోయినగొంతుకలతో, 'అన్నమో రామచంద్రా!' యని భారతదీనజనకోటి విలపించుచున్నది. అన్నముకోసము వారు విలపించుచుండ మనము వారికిచ్చుచున్న వేమి?—రాళ్లు; పిడికెడన్నము లేక వారు పస్తుపడియుండ మనము వారికి చేయుచున్న వేమి?-ధర్మబోధలు. ఇది మహాపరాధము కాదా? హిందూదేశములో ధనమును గోరి మతబోధ చేయువాడు జాతిభ్రష్టుడై, జనులచే నుమ్మివేయబడును. నిరుపేదలగు నా సోదరదేశీయులకు సాయము నరయుటకుగాను నేనిచటికి వచ్చియున్నాను; క్రైస్తవదేశ

మున క్రైస్తవులవలన అన్యమతస్థులకు సాయ
మును బొందుట యెంతటి కష్టమో పూర్తిగా
నాకు బోధపడినది.

## హిందూమతసాఫల్యమే బౌద్ధమతము

(1893-వ సం. సెప్టెంబరు, 26-వ తేది)

నేను మీరు వినినరీతి బౌద్ధుడను కాకున్నను
బౌద్ధుడనే, చైనాగాని, జపాన్ గాని, సింహళము
(Ceylon) గాని ఆ మహాప్రభుని బోధల ననుస
రించుచున్నచో, భారతదేశ మాతని సాక్షా
దవతారమూర్తియని పూజించును. నేను
బౌద్ధమతమును ఖండింపబోవుచున్నానని మీ
రిపుడు వినియున్నారు, కాని దానివలన మిమ్ము
నేను గ్రహింపగోరున దిది. సాక్షాదవతార
మూర్తియని నేను పూజించు మహనీయుని భావ
ములను ఖండించుటయా! బుద్ధదేవుని శిష్యు

లాతనితత్త్వమును సరిగా నవగాహన చేసికొన జాలకపోయిరని యాతనిగూర్చి మా యభిప్రాయము. యూదియామతము (Judaism) నకును క్రైస్తవమతమునకును ఇంచుమించుగా ఎట్టి సంబంధము గలదో, హిందూమతమునకును (హిందూమతమనగా వైదికధర్మమని-సనాతన ధర్మమని-నా యభిప్రాయము) బౌద్ధమతమునకును నే డట్టిసంబంధమే కలదు. ఏసుక్రీస్తు యూదుఁడు, శాక్యముని హిందువుడు. యూదులు ఏసుక్రీస్తును త్రోసిరాజనిరి—కాదు—సిలువను కొఱత వేసిరి; కానిహిందువులు శాక్యమునిని దైవముగా నమ్మి పూజించుచున్నారు. ఆధునిక బౌద్ధమతమునకును బుద్ధదేవుని బోధనలుగా మనము గ్రహింపవలసియున్న తత్త్వములకును నిజమైన భేదమని హిందువులమగు మేము ముఖ్యముగా చూపగోరునదిది: శాక్యముని నూతనతత్త్వము

నేమియు బోధింపరాలేదు. ఆతడును ఏసువలెనే (మతధర్మములను) సఫలముచేయుటకే కాని నశింపజేయుటకు రాలేదు. కాని వ్యత్యాసమిది: ఏసువిషయమున, ఆతనిబోధలను గ్రహింప జాలకపోయినవారు ప్రాచీనులగు యూదులు; బుద్ధునివిషయముననో, ఆతని తత్త్వసారమును గ్రహింపజాలకపోయిన వ్యక్తులు స్వయముగా నాతని యనుయాయులే. ప్రాతనిబంధన (Old Testament)సాఫల్యమునుయూదులుగ్రహింప జాలకుండినయట్లే హిందూమత తత్త్వసాఫ ల్యమును బౌద్ధులరయజాలకపోయిరి. శాక్యముని మతధర్మములను వేనినిగాని నశింప జేయుటకు జనింపలేదనియు హిందూమతతత్త్వ ముల కాతడు సహేతుకమగు పరిణతియై, సహేతుకమగు సిద్ధాంతమై యొప్పెననియు మజల నేను నొక్కి వక్కాణించుచున్నాను.

హిందువుల ధర్మము కర్మకాండ, జ్ఞాన కాండయునని రెండుభాగములుగా విభజింపబడి యున్నది; జ్ఞానకాండను ముఖ్యముగా సన్న్యాసు లవలంబింతురు.

అందు (అనగా జ్ఞానకాండవిషయమున) జాతిభేదమనునది—వర్ణభేదమనునది— లేదు. అగ్రవర్ణజుడును అంత్యవర్ణజుడును గూడ సన్న్యాసి కావచ్చును, అపు డుభయవర్ణము లును సమానమగును. మతవిషయమున వర్ణ వ్యవస్థ యనునది లేనే లేదు. వర్ణవ్యవస్థ కేవలము సాంఘికమగు కట్టుపాటు. శాక్యముని స్వయ ముగా సన్న్యాసి; నిగూఢమగు వేదతత్త్వ మును వెలువరించి, సమస్తప్రపంచమునను వ్యాప్తి గావించిన మహనీయు డాతడు, ధర్మ ప్రచారము నాచరణలోనికి గొనివచ్చుటకు— ఏల, మతపరివర్తనము (అనగా ఇతరమతస్థు

లచే తనమత మవలంబింపజేసి వారిని స్వమత మున జేర్చుకొనుట) అనెడి యాశయము నూహించుట కాతడే ప్రథముడు.

ఎల్లర యెడలను, ముఖ్యముగా సజ్జనులయెడలను పేదలయెడలను ఆ గురువరేణ్యుడు వహించిన యద్భుతసానుభూతియం దాతనిమహాత్త్వ మంతయు నిమిడియున్నది. ఆతని శిష్యులలో గొందఱు స్వయముగా బ్రాహ్మణులు. బుద్ధుడు ధర్మప్రచార మొనర్చినసమయమున హిందూ దేశమున సంస్కృతము వ్యావహారిక భాష కాదు. అది కేవలము పండితుల గ్రంథములలో నుండెను. బుద్ధుని బ్రాహ్మణశిష్యులు గొందఱాతని బోధనలను సంస్కృతములోనికి అనువదింపగోర, వారి కి ట్లాతడు స్పష్టముగా దెలిపెను : ''పేదలకు, జనసామాన్యమునకు, తోడ్పడుటయే నా యాశయము ;జనులమాతృ

భాషలోనే నన్ను మాటాడనిండు.'' కావున నేటివఱ కాతని బోధనలలో విశేషభాగము నాటి దేశీయభాషయందే యున్నది.

తత్త్వశాస్త్ర మేమి చెప్పినను, వేదాంత మేమి స్థిరపఱచినను, లోకమున మరణ మనునది యున్నంతవఱకు, మానవహృదయ మున దౌర్బల్యమనునది యున్నంతవఱకు, దుర్బలావస్థయందు మానవహృదయమందుండి (రక్షణార్థము) ఆర్తనాదము వెలువడుచున్నంత వఱకు, భగవంతునియందు నమ్మికయనునది యుండితీరును.

తాత్త్వికవిషయమున బుద్ధదేవునిశిష్యులు వేదములనెడి సుస్థిరపర్వతములను ఢీకొని వాని వదలింపజాలకపోవుటట్లుండ, స్త్రీగా నిండు, పురుషుడుగానిండు, ప్రతివ్యక్తియు నేఁత మోయాశలో నాశ్రయించుకొనియుండు భగవంతు

డనెడి శాశ్వతమగు నవలంబమును సమాజము
నందుండి లాగివేసిరి. ఫలిత మేమి! బౌద్ధ
మతము హిందూదేశమున స్వాభావిక మగు
వినాశము నొందవలసివచ్చెను. బౌద్ధమత జన్మ
స్థానమగు భారతదేశమున నేడు బౌద్ధుడనిపించు
కొనువా డొక్కడును లేడు.

కాని బ్రాహ్మణమతమునకు కొంత నష్టము
ఘటిల్లినది: ఆ సంస్కరణదీక్ష, ప్రతి జీవి
యెడలను బ్రసరించునట్టి యా యద్భుత దాన
దయాధర్మములు, నాటి హిందూదేశమును
గూర్చి గ్రీసుదేశీయ చరిత్రకారు డొకడు,
హిందువుడు కల్లలాడుటకాని, హైందవస్త్రీ
వ్యభిచారిణియై యుండుటకాని తాను కని విని
యెఱుగనని వచించియుండునంతటి ఘనతను
హైందవసమాజమున కొనగూర్చి, జన
సామాన్యమున బౌద్ధమతము వెల్గొందజేసిన

యీయద్భుతపరివర్తనప్రభావము - ఇవన్నియు బ్రాహ్మణమతమున కొఱవడినవి.

హిందూమతములేనిదే బౌద్ధమతమును బౌద్ధమతములేనిదే హిందూమతమును చైతన్యవంతములై యుండజాలవు. కావున బ్రాహ్మణుల ధీశక్తియు వేదాంతవిజ్ఞానమును లేనిదే బౌద్ధులు నిలువజాలరనియు బౌద్ధుల యౌదార్యమును సర్వభూతప్రేమయు లేనిదే బ్రాహ్మణులు నిలువజాలరనియు పరస్పర వియోగము మన కెట్లు చాటుచున్నదో గమనింపుడు. బ్రాహ్మణులకును బౌద్ధులకును ఒండొరులతో గలిగిన యీ యెడబాటే హిందూదేశ పతనమునకు కారణము. హిందూదేశము ముప్పదికోట్ల బిచ్చగాండ్రతో గూడుకొని యుండుటకును వేయేండ్లుగా విదేశీయ విజేతలకు దాస్యము చేయుచుండుటకును ఇదియే కారణము. కావున

ఆ గురువరేణ్యుని (బుద్ధుని) యౌదార్యముతో, అద్భుతమగు లోకహితాచరణప్రేరకశక్తి సామర్థ్యములతో బ్రాహ్మణుని యఖండధీశక్తిని మేళవింతము గాక.

## అంతిమసమావేశమునందలి యుపన్యాసము

(1893-వ సం. సెప్టెంబరు, 27-వ తేది)

ప్రపంచమతమహాసభ చరితార్థత నొందినది. ఈమహాసమావేశమును సమకూర్చుటకై పరిశ్రమించినవారలకు అల దయామయుడగు పరమేశ్వరుడు తోడ్పడి వారల స్వార్థరహిత పరిశ్రమను సాఫల్యము నొందించి యున్నాడు.

తమ సత్యనిరతిచే, ఔదార్యముచే ఈదివ్య సంఘటనమునుగుఱించి మొదట సమాలోచించి యనంతరము దీనిని కార్యరూపము నొందించిన మహనీయులకు నా యభివందనములు,

ఈసభావేదికయందుండి వెల్లివిరిసిన యుదార భావములకు నా యభివందనములు. ఆమూలము నేకరీతిని నాయెడ దయజూపిన యీసభాస్తారులకు — వివిధమతాంతర్గతవైషమ్యమును బోనడచెడిప్రతిసద్భావమును ప్రశంసాపూర్వకముగా నాలకించిన యీ సభాసదులకు — నా యభివందనములు. ఈ స్వరసమ్మేళనమున అపుడపుడు కొన్ని యపస్వరములును మన చెవి సోకినవి. అయ్యవి ప్రత్యేకమగు తమవైషమ్యము చేతనే సామాన్య సామరస్యమును మధురతరము గావించియున్నవి గావున వానికి నా ప్రత్యేకాభివందనములు.

మతైక్యమునకు సర్వమతసామాన్యోపపత్తులనుగూర్చి విశేషముగా వినియున్నాము. నేనిపుడిందులకు నాసిద్ధాంతమును దేనినిగాని ప్రత్యేకముగా ప్రకటింపసాహసించుటలేదు. ఏ యొకా

నొకమతమో యుత్కర్షమును బొంది మిగిలిన వన్నియు నశించుటచే ఈ యైక్యము సిద్ధించునని యిచటివారెవ్వరైనను తలతురేని, నేను వారికి, "అన్నా! నీది యసాధ్యమైన ఆశ సుమీ!" యని చెప్పెదను. క్రైస్తవుడు హిందూమత మవలంబింపవలయునని నేను కోరెదనా? శివ! శివా! నే నెన్నడట్లు కోరను. హిందువుడు గాని, బౌద్ధుడుగాని క్రైస్తవమతము నవలం బింపవలయునని కోరెదనా? రామ! రామ! కలనైనను కోరను.

విత్తనము నేలలో నాటబడినది; మన్ను, గాలి, నీరును దానిని చుట్టువారి యున్నవి. ఆ విత్తనము మన్నగునా, గాలి యగునా, లేక నీరగునా? ఏదియుగాదు. అది మొక్కయగును —ఆత్మవికాసనియమము ననుసరించి యభి వృద్ధినొందుచు, గాలిని మన్నును నీటిని జీర్ణించు

కొని వానిని వృక్షతత్త్వముగా మార్చుచు, మొక్కగా పరిణమించును.

మతవిషయము—ధర్మవిషయము—కూడ నిట్టిదే. క్రైస్తవుడు హిందువుడుగాని బౌద్ధుడుగాని కానక్కఱలేదు, మఱియు హిందువుడుగాని, బౌద్ధుడుగాని క్రైస్తవుడును గానక్కఱలేదు. కాని ప్రతివ్యక్తియు ఇతరులభావములను — ఇతరమతసారమును — గ్రహించుచుండియు స్వీయవ్యక్తిత్వమును నిలుపుకొని, స్వీయవికాసనియమానుసారము అభివృద్ధినొందవలయును.

మతమహాసభ లోకమున కేమైన జాటినచో అది యిది : పూజ్యత, పవిత్రత, త్యాగము— ఇవి ప్రపంచమున ఏ మతసంస్థకును ప్రత్యేకమగు 'హక్కులు' గావనియు ప్రతిమతమును లోకోత్తరచరిత్రులగు పురుషులను స్త్రీలనుద్భ

వింప జేసినదనియు జాటినది. ఇట్లు విస్పష్టమై
యుండ, నెవ్వరైనను తమమత మొక్కటియే
సుస్థిరముగా నిలిచి, యితరమతములన్నియు
నశింపవలయునని భావించు నెడల, అట్టి మంద
బుద్ధుల యవివేకమునకు నా హృదయాంతర్గత
పరితాపమును దెలుపుచు, వారెంత ప్రతి
ఘటించినను, "వలయునది కలహము కాదు.
సహకారము"; "అన్యమతధ్వంసము కాదు.
తదాశయగ్రహణము"; * "శత్రుత్వము కాదు.

* అన్యమతాశయగ్రహణవిషయమున ఈ క్రింది
సంఘటన మెంతయు గమనింపదగియున్నది:

"సర్వమతమహాసభలో దనయుపన్యాసమధ్యమున
శ్రీ వివేకానందస్వామి యొక నిమేషము ఆగి, 'హిందు
వుల వేదశాస్త్రములను జదివి, వారిమతమును గూర్చి
స్వతంత్రజ్ఞానమును బడసినవారు మీలో నెందఱు
గలరో చేతు లెత్తుడు'' అని వచించెను. వివిధదేశ
తత్త్వజ్ఞశిఖామణులతో గూడిన యా మహాసభనుండి

శాంతియుత సమన్వయము” అని మతపతాకలపై వ్రాయబడుదినము శీఘ్రకాలముననే వచ్చితీరు నని తెల్పెదను.

ఓం తత్ సత్

శ్రీరామకృష్ణార్పణమస్తు!

---

మువ్వురు నలువురు మాత్రమే చేతు లెత్తిరి. అంత నాతడు తన ప్రతిభాతిశయ మొప్ప, వాత్సల్యపూర్వకముగా సభ్యులను అవలోకించి, సభ్యులు లజ్జావనత వదనులగునట్లు సరళగంభీరోక్తుల నిట్లు పల్కెను: “ఇట్టి స్థితిలోనా మీరు మమ్ముగూర్చి విమర్శింప సాహసించుట!”

—చరిత్రకారుల ప్రపంచచరిత్ర
(Historians' History of the World)

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

## శ్రీరామకృష్ణ సూక్తిసుధ

అనువాదకులు :

### శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు

'మానవోద్ధారకవచనామృతము ఇట్టి గ్రంథముగా రూపొందుటకు ఇదే మొదలు' (ఆల్డస్‌హక్స్లీ) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేట తెలుగున అనువాదము.

'చవులూర చదివితిని. చక్కని రచన'.

—డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణన్ గారు

"చక్కని సాహిత్యపటిమ, అనువాదమైనను స్వతంత్రధార అనిపించుధాటి, ప్రసన్నము సరళము సర్వసుగ్రాహ్యము సలక్షణము నైన శైలి. ప్రాచీనుల ద్విపదలలో తుంతురూగు 'మంజరి' 'గీతిక'లు, అద్యతన గద్య రచయితలెల్ల మేలుబంతిగ అనుసరింపదగిన రీతి పాకశయ్యా సౌభాగ్యము—గల గ్రంథరాజము".

—సండే స్టాండర్డు, 16-2-58

(590+158) వెల: రూ. 7-50

శ్రీరామకృష్ణమఠ ప్రచురణములు

# శ్రీరామకృష్ణ బోధామృతము

1121 మహోపదేశములు గల

## శ్రీరామకృష్ణ వాక్యరత్నాకరము

సంగ్రహజీవిత సహితము

...ఇందు సుమారు 80 నీతికథారత్నములు కలవు. ...ముఖ్యమగు తావులందు వేదశాస్త్ర ప్రమాణవచనములు క్రోడీకరింపబడి గ్రంథప్రాశస్త్యమును ద్విగుణీకృత మొనర్చుచున్నవి. —కృష్ణాపత్రిక

శ్రీరామకృష్ణపరమహంస కత్తిఅంచులాగా తీక్ష్ణమై, దుర్గమమైన విషయాలను ఎంత ద్రాక్షాపాకంలో చెప్పారో, శ్రీ చిరంతనానందస్వాములూ అంత సులభ సుందరమైన ద్రాక్షాపాకంలో తెలివిడిచేశారు.—ఆంధ్రపత్రిక

...శ్రీ చిరంతనానందస్వాములవారిట్టి గ్రంథముల యాంధ్రీకరణమున సిద్ధహస్తులు. వీరిశైలి సరళమై, సర్వజనసుబోధమై మృదుమధురమై, ద్రాక్షాపాకమున నలరారుచుండును. —త్రిలిఙ్గ

... రామకృష్ణుని యుపదేశము లొకపండిత మాత్రుని వాక్యములు కావు, అవి జీవితమను గ్రంథము

లోని పుటలు, స్వానుభవ నిదర్శనములు. కావుననే వానిని జదువునప్పుడు పాఠకునికి అనివార్యముగు చిత్త సంస్కారము గలుగుచుండును. —గాంధి మహాత్ముడు

540 పుటలు (ఐదవ కూర్పు) వెల : రూ. 3-50

## శ్రీ శారదాదేవి చరిత్ర

చిరంతనానంద విరచితము)

శ్రీరామకృష్ణుని సహధర్మచారిణియై, అతనిచే స్వయముగా పూజలందిన మహనీయురాలి సమగ్ర జీవిత చరిత్ర.

అరమునవే కాక భావను గూడ మీ యీ రచన అమృతధారావాహిని. —వేటూరి ప్రభాకరశాస్త్రి

...అమృతకలశము!...అద్భుతమైన సరళ...అనన్యసామాన్య నీతిమంజరి...కళాశాలలకు పఠనీయముగా నుండ నిది ఉత్తమమైనది. —ఆంధ్రప్రభ

...జీవిత చరిత్రలు వ్రాయుటలో ఈ గ్రంథకర్తది సిద్ధహస్తమని శారదాదేవి చరిత్ర చాటుతూవుంది.

—ప్రజాబంధు

248 పుటలు (చక్కని కూర్పు) వెల : రూ. 2-00

శ్రీరామకృష్ణమఠ ప్రచురణములు

# స్వామి - శిష్య సంవాదములు

## (శ్రీమద్వివేకానందస్వామితోడి సంభాషణలు)

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

సాంసారిక సమస్యలు పరిష్కరించుకొనదలచినను సమాధిస్థితి సాధింపదలచినను; రాజకీయవిశేషము లాకళింపదలచినను, అలౌకికశాస్త్రరహస్యము లవగతము చేసికొనదలచినను—ఇంతేల, లౌకికాలౌకిక విషయములలో దేనినిగురించిగాని మీ పరిజ్ఞానము వృద్ధిగావించుకొనదలచినచో ఈ గ్రంథమును తప్పక చదువుడు. నవభారతభాగ్యవిధాత శ్రీమద్వివేకానందస్వామి చంద్రులు శిష్యులతో గావించిన యీ ప్రసంగములలో వారి అనుభవసర్వస్వము రాశీభూతమై యున్నది. సులభశైలి, హృదయమును పట్టి యిచ్చు సంభాషణలు, ముచ్చటైన అచ్చుతీరు.

అకారాది అనుక్రమణికయు గలదు

పుటలు : 652+12

# శుద్ధపత్రము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| v | 4 | యీవలన | యీవలకు |
| | 8 | మనబోధకులను | మతబోధకులను |
| vii | 11 | సన్యాసము | న్యాసము |
| 3 | 5 | గుటియె | గుటియై |
| 18 | 15 | అభీష్ట | అభీష్ట |
| 25 | 6 | ఉపాదులచే | ఉపాధులచే |
| 30 | 5 | సోదరులాలా | సోదరులారా |
| 31 | 16 | తైత్తిరీయోనిషత్తు | తైత్తిరీయోపనిషత్తు |
| 34 | 11 | త్యక్త్వా | త్యక్త్వా |
| 37 | 9 | స్వభావాద్ఘైవ | స్వభావాచ్చైవ |

| పుట | పంక్తి | | ఒప్పు |
|---|---|---|---|
| 42 | 8 | తిననదే | తిననిదే |
| 43 | 15 | వివేకానందస్వామియే | వివేకానందస్వామియే |
| 61 | 15 | భగవదీత | భగవద్గీత |
| 64 | 15 | దొడ్పుడుటయే | దోడ్పుడుటయే |
| దివరి 3 | 4 | వెల : రూ. 3-50 (ఐదవకూర్పు) | వెల : రూ. 4-50 (ఏడవకూర్పు) |
| ,, | 18 | వెల : రూ. 2-00 | వెల : రూ. 2-75 |
| 4 | 8 | మునకు | మునకు |
| 5 | 8 | లౌకిగాలౌకిక | లౌకికాలౌకిక |
| 6 | శీర్షిక | శ్రీరామకృష్ణ | శ్రీరామకృష్ణ మఠ |
| ,, | 9-వ పంక్తి తరువాత పరతత్త్వ ప్రసంగము వె రూ. 2-00 అని చదువుకొనవలయును. | | |